ఇతి శ్రీరమణగీతాసు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
రమణాంతేవాసినో వాసిష్ఠస్య గణపతే రుపనిబంధే
భక్తివిచారోనామ షోడశోధ్యాయః.

ఇట్టుల బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమునగు శ్రీ రమణగీతయందు
శ్రీ రమణశిష్యుఁడును వాసిష్ఠుండునైన గణపతిచేఁ జేయబడిన
గ్రంథమున భక్తివిచారమను పదునాఱవ అధ్యాయము.

---

## సప్తదశోధ్యాయః

### జ్ఞానప్రాప్తివిచారః

1. పంచవింశేతుదివసే వైదర్భోవిదుషాంవరః।
ప్రశ్రయావనతోభూత్వామునింభూయోపిపృష్టవాన్॥

పదునేడవ అధ్యాయము

ఇరువదియైదవదినమున విద్వచ్ఛ్రేష్ఠుఁడగు వైదర్భుఁడు అడకువచే వంగినవాఁడై మునిని తిరుగ ప్రశ్నించెను.

వైదర్భ ఉవాచ

2. క్రమేణాయాతికింజ్ఞానం కించిత్కించిద్దినేదినే।
ఏకస్మిన్నేవకాలే కిం పూర్ణమాభాతిభానువత్॥

వైదర్భుని వాక్యము

ప్రతిదినమున కొంచెము కొంచెము క్రమముగ జ్ఞానము గలుగుచున్నదా, లేక యొక సమయమున నిండినదై సూర్యునివలె వెలుగుచున్నదా?

భగవానువాచ

3. క్రమేణాయాతి సజ్జ్ఞానం కించిత్కించిద్దినే దినే।
అభ్యాసపరిపాకేన భాసతే పూర్ణమేకదా॥

భగవంతుని వాక్యము

ప్రతిదినమున క్రమముగ జ్ఞానము కొంచెము కొంచెముగఁ గలుగదు. అది అభ్యాసముయొక్క పరిపాకముచే పూర్ణమై యొకప్పుడే ప్రకాశింపుచున్నది.

వైదర్భ ఉవాచ

4. అభ్యాసకాలే భగవన్ వృత్తిరంతర్బహిస్తథా।
యాతాయాతిం ప్రకుర్వాణా యా సేకిం జ్ఞానముచ్యతే॥

వైదర్భుని వాక్యము

ఓ భగవంతుడా! వ్యాపారము (అత్మవృత్తి) అభ్యాసకాలమున లోపలికి బయటికి పోవుచు వచ్చుచున్నది; ఈ యాతాయాతముగ నుండువృత్తి జ్ఞానమని చెప్పబడునా?

భగవానువాచ

5. అంతర్యాతా మతిర్యద్వద్బహిర్యాయాతి చేత్పునః।
అభ్యాసమేవ తామాహుః జ్ఞానంహ్యనుభవోచ్యతే॥

భగవంతుని వాక్యము

ఓ విద్వాంసుఁడా! లోపలప్రవేశించిన బుద్ధి మఱల వెలుపల వచ్చుచున్నదాయెనా దాని నభ్యాసముగనే చెప్పుదురు. జ్ఞాని యనుభవమే జ్ఞానమనిఁ జెప్పబడుచున్నది.

వైదర్భ ఉవాచ

6. జ్ఞానస్యమునిశార్దూల భూమికాః కాశ్చిదీరితాః।
శాస్త్రేషువిదుషాంశ్రేష్ఠైః కథంతాసాంసమన్వయః॥

వైదర్భుని వాక్యము

6. మునిశ్రేష్ఠుండా! విద్వచ్ఛ్రేష్ఠులు శాస్త్రములయందు జ్ఞానము నకుఁ గొన్ని తారతమ్యములను చెప్పిరి. వానియొక్క చేరిక (సమన్వయము) ఎట్లు?

భగవానువాచ

7. శాస్త్రోక్తాభూమికాస్సర్వాః భవంతిపరబుద్ధిగాః।
ముక్తిభేదాఇవప్రాజ్ఞ జ్ఞానమేకంప్రజానతాం॥

భగవంతుని వాక్యము

ముక్తిభేదములవలెనే శాస్త్రమునందు చెప్పిన జ్ఞానముయొక్క తారతమ్యములు పరబుద్ధికిమాత్రము గోచరించును. వస్తుతః జ్ఞానుల జ్ఞానమొక్కటియే.

8. చర్యాందేహేంద్రియాదీనాం వీక్ష్యారబ్ధానుసారిణీం।
కల్పయంతిపరేభూమీ స్తారతమ్యంనవస్తుతః॥

ప్రారబ్ధమునననుసరించినది అయిన దేహము ఇంద్రియము మున్నగు వానియొక్క నడవడినిజూచి, ఇతరులు జ్ఞానమునకు భేదములను ఏర్పఱచు చున్నారు. వస్తురూపమున నిజముగ జ్ఞానమునకు హెచ్చుతక్కువలు లేవు.

వైదర్భ ఉవాచ

9. ప్రజ్ఞానమేకదాసిద్ధం సర్వాజ్ఞాననిబర్హణం।
తిరోధత్తేకిమజ్ఞానా త్సంగాదంకురితాత్పునః॥

వైదర్భ్యుని వాక్యము

సకలములకు అజ్ఞానములం బోగొట్టునదియైన గొప్ప జ్ఞానము ఒక ప్పుడు కలిగినదై సంగముచేం గలిగిన యజ్ఞానముచే మఱల మఱుంగఁబడు చున్నదా?

భగవానువాచ

10. అజ్ఞానస్యప్రతిద్వంద్వి నపరాభూయతేపునః।
ప్రజ్ఞానమేకదాసిద్ధం భరద్వాజకులోద్భవ॥

భగవంతుని వాక్యము

ఓ భారద్వాజుండా! అజ్ఞానమును పోంగొట్టునదై యొకప్పుడు కలిగిన జ్ఞానము మఱలం దిరస్కరింపంబడదు. (అనగా పోలగదు).

ఇతి శ్రీ రమణగీతాసు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
రమణాంతేవాసినో వాసిష్ఠస్య గణపతే రుపనిబంధే
జ్ఞానప్రాప్తి విచారోనామ సప్తదశోఽధ్యాయః.

ఇట్టుల బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమునగు శ్రీ రమణగీతయందు
శ్రీ రమణ శిష్యుడును వాసిష్ఠుండునైన గణపతిచేం జేయబడిన
గ్రంథమున జ్ఞానప్రాప్తివిచారమను
పదునేడవ యధ్యాయము.

---

## అష్టాదశోఽధ్యాయః

### సిద్ధ మ హి మా ను కీ ర్త న ం

1. వరపరాశరగోత్రసముద్భవం, వసుమతీసురసంఘయశస్కరం।
విమలసుందరపండితనందనం, కమలపత్రవిశాలవిలోచనం॥

## పదునెనిమిదవ అధ్యాయము

శ్రేష్ఠమగు పరాశరగోత్రమందుద్భవించిన వాఁడును, బ్రాహ్మణ సంఘమునకు కీర్తి తెచ్చినవాఁడును, నిర్మలుఁడైన సుందరపండితుని కొమారుఁడును, తామరరేకులవలె విశాలములగు కన్నులుగలవాఁడును,

2. అరుణశైలగతాశ్రమవాసినం
పరమహంసమనంజనమచ్యుతం।
కరుణయా దధతంవ్యవహారితాం
సతతమాత్మనిసంస్థితముక్షరే॥

అరుణశైలమందలి యాశ్రమమున వసించువాఁడును, పరమహంసుఁడును, నిష్కళంకుఁడును, నిష్ఠనుండి జారనివాఁడును, దయచే మౌనము వదలి మాటలాడు వాఁడును, నాశరహితమగు నాత్మయం దెల్లప్పుడు నిలకడఁ జెందిన వాఁడును;

3. అఖిలసంశయవారణ భాషణం
భ్రమమదద్విరదాంకుశవీక్షణం।
అవిరతంపరసౌఖ్యధృతోద్యమం
నిజతనూవిషయేష్వలసాలసం॥

సకల సంశయములఁ బోలఁగొట్టోయు మాటలు గలవాఁడును, భ్రమయను మదగజమునకు అంకుశమువంటి చూపుగలవాఁడును, ఎప్పుడును ఇతరుల సుఖమునకు ప్రయత్నము నందున్నవాఁడును, తనయొక్క శరీరవిషయములందు మిగుల యలసుఁడును;

4. పరిణతామ్రఫలప్రభవిగ్రహం
చలతరేంద్రియనిగ్రహసగ్రహం।
అమృతచిద్ఘనవల్లిపరిగ్రహం
మితవచోరచితాగమసంగ్రహం॥

పండినమామిడిపండుయొక్క కాంతివంటి కాంతిగల శరీరముగల వాఁడును, మిగుల చరించు ఇంద్రియములను లోబఱచుకొను శక్తిగల వాఁడును, నాశరహితమగుజ్ఞానము అను గొప్పదగు వల్లి నాయికను స్వీకరించినవాఁడును, మితములయిన మాటలచే శాస్త్రసంగ్రహమును గల్పించువాఁడును;

5. అమలకీస్తృతనాత్మమరీచిభిః ... ర్యైః
నిజకరైరివపంకజబాంధవం।
పదజుషాంజడభావమనేహసా
పరిహరంతమనంతగుణాకరం



తనకిరణములచేత సూర్యునివలె నిర్మలములై మిగుల ప్రకాశించు ఆత్మతేజస్సులచే పదంబుల నాశ్రయించినవారియొక్క జడభావమును కాలక్రమమున పోఁగొట్టుచున్నవాఁడును, అనంతగుణంబుల కునికిపట్టగు వాఁడును;

6. మృదుమతిమంవచనేదృశిశీతలం
వికసితంవదనేసరసీరుహే।
మనసిశూన్యమహర్మణిసన్నిభే
హృదిలసంతమనంతశివాగమం॥

మృదువులగు మాటలుగలవాఁడును, చల్లని చూపులుగలవాఁడును, వికసించిన ముఖపద్మము గలవాఁడును పగటిచంద్రునివలె శూన్యంబగు మానసము గలవాఁడును, ఆకాశమునందు సూర్యునివలె హృదయమునందు నిష్ఠితుండై ప్రకాశించువాఁడును;

7. అదయమాత్మతిసౌఖ్యసంప్రవర్తే
పరుషచిత్తమలంవిషయప్రవణే।
ఋషిమరోషమపేతమనోరథం
ధృతమదంభమనల్పహరివశాత్॥

తనశరీరమునం దభిమానము లేనివాఁడును, కఠినమగు నియమము గలవాఁడును, స్రక్చందనాది భోగములందు అపేక్షలేని చిత్తముగల వాఁడును, కోపము లేనివాఁడును, కోరికలు గోరనివాఁడును, గొప్పదగు జ్ఞానప్రవాహమున కధీనుఁడగుటచేత మైమఱచినవాఁడును;

8. విగతమోహమలోభమభావసం
శమితమత్సరముత్సవినంసదా।
భవమహోదధితారణకర్మణి
ప్రతిఫలేనవినైవసదోద్యతం॥

మోహము లేనివాఁడును, లోభములేనివాఁడును, తలంపులు లేని వాఁడును, మాత్సర్యము లేనివాఁడును, ఎల్లప్పుడు సంతోషము గల వాఁడును, ప్రతిఫలము లేకనే యెప్పుడును భక్తులను సంసారమను సము ద్రమును తరింపజేయుటయందు ప్రయత్నించువాఁడును;

9. మాతామమేతినగరాజసుతోపకంఠం
నాగాననేభజఠియాహింపితామమేతి।
అంకంగతస్యసమవాప్యశిరస్యనేన
సంచుంబితస్యగిరిరంధ్రికృతోవిభాతిం॥

విఘ్నేశ్వరుఁడు తల్లి నాదియని పార్వతియొక్క అంకపీఠమును చేరియుండఁగ, తండ్రి నావాఁడు నీవు పొమ్మని యీశ్వరుని యంక మాశ్ర యించిన వాఁడును, ఈశ్వరునిచే శిరస్సున ముద్దుబెట్టుకొనబడినవాఁడు నగు కుమారస్వామియొక్క అంశభూతుఁడును;

10. వేదాదిపాకదమనోత్తరకచ్ఛపీశైః
యుక్తైర్ధరాధరసుమృత్యమరేశ్వరైశ్చ।
సూక్ష్మామృతాయుగమ్యతేనసహాప్రణాత్యా
సంపన్నశబ్దపటలస్యరసాస్యమర్థం॥

1. వేదాది అనగా వేదమునకాదియగు ప్రణవము — ఓం

2. పాకదమన అనగా ఇంద్రబీజ ల కారము నకు ఉత్తరము అనగా ప్రక్కనిదగు. — వ

3. కచ్ఛపేశం అనగా కూర్మబీజమగు — చ

4. ధరాధర అనగా పర్వతిబీజ ద కారము
సుషుప్తి అనగా నిద్రాబీజ భ కారము
అమరేశ్వర అనగా రుద్రబీజః ఉ కారము
ఈ మూడును కలిసినదైన — ద్భు

5. సూక్ష్మామృతా అనగా ఏ కారముతో గూడిన అమృతము అనగా నమృతబీజ వ కారము (అనగా) — వే

6. ప్రణుతి, నమస్కారము — నమః

అను వీనిచే నేర్పడిన శబ్దపటలమునకు అనగా మంత్రమునకు రహస్యార్థమైనవాఁడును[ "ఓం వచద్భువేనమః" అను స్కందమహామంత్రముచే నుపాసింపదగినవాఁడని తాత్పర్యము.]

11. దండంవినైవయతినంబతదండపాణిం
దుఃఖాబ్ధితారకమరింబతతారకస్య।
త్యక్త్వాభవంభవమహోసతతంభజంతం
హంసంతథాపిగతమానససంగరాగం॥

దండము లేని యతియయ్యు దండపాణియు (ఇది ఆశ్చర్యము), దుఃఖసముద్రమునకు తారకుఁడు (దాటించువాఁడు) అయినను తారకునికి

శత్రువును (కుమారుడు), సంసారమును వదలి యెప్పుడును ఈశ్వరుని సేవించువాఁడును (అనఁగా భవమును వదలియూ భవుని సేవించువాఁడును), హంసయైనను మానససరోవరమున అనురాగము లేనివాఁడును, (అనఁగా మనస్సంబంధమగు యనురాగము లేనివాఁడును);

12. ధీరత్వసంపది సువర్ణగిరేరనూనం
వారాన్నిధేరధికమేవ గభీరతాయాం।
క్షాంతౌ జయంతిమచలామఖిలస్య ధాత్రీం
దాంతౌ నిదర్శనమశాంతికథాదవిష్ఠం॥

ధైర్యమున మేరువుకంటె తగ్గనివాఁడును, గాంభీర్యమున సముద్రముకంటె నధికుఁడును, ఓర్పునందు భూమిని జయించినవాఁడును, అంతరింద్రియ నిగ్రహమున నుదాహరణమును, శాంతిగలవాఁడును;

13. నీహారవిందసుహృదా సదృశం ప్రసాదే
తుల్యం తథా మహసి తోయజబాంధవేన।
బ్రాహ్మ్యాం స్థితౌ తు పితరం వటమూలవాసం
సంస్మారయంతమచలం తమనూదితం మే।

చల్లదనమున చంద్రుని బోలువాఁడును, ప్రకాశమున సూర్యుని బోలువాఁడును, బ్రాహ్మీస్థితియందు పటమూలవాసియగు దక్షిణామూర్తిని తలపింపఁ జేయువాఁడును, యచలుఁడును, నాకు తరువాత నుదయించినవాఁడును;

14. యస్యాధునాపి రమణేరమణీయభావా
గీర్వాణలోకప్రతనాశుభవృత్తిరూపా।
సంశోభతే శిరసి నాపి మనోజగంధ
స్తత్తాదృశం గృహిణమప్యధిపం యతీనాం॥

ఎవనియొక్క శిరస్సున ఇప్పటికిని రమణీయవృత్తియగు దేవసేవ

(రమణి) యున్నదో, యుండినను మన్మథవాసనయు లేదో అట్టి గృహస్థుఁడైనను యతులలో నొప్పువాఁడును;

15. వందారులోకవరదంనరదంతినోపి
మంత్రేశ్వరస్యమహతో గురుతాంవహంతం।
మందారవృక్షమివసర్వజనస్యపాద
చ్ఛాయాంశ్రితస్యపరితాపమపాహరంతం॥

భక్తజనవరదుఁడును, నరదంతి నామముగల మంత్రేశ్వరునికి (గణపతియను మంత్రశాస్త్రవేత్తకు) గురువును, పాదములనాశ్రయించిన యెల్లరకు పారిజాతమువలె తాపముఁ బోగొట్టువాఁడును;

16. యస్తంత్రవార్తికమనేకవిచిత్రయుక్తి
సంశోభితంనిగమమూలవచఃనగాంతతేన।
భట్టస్యతస్యబుధసంహతిసంస్తుతస్య
వేదాంతతంతునిగమాంతవచోవిచారీ।

ఎవఁడు వేదములకాధారమగు ననేక విచిత్రయుక్తులచేఁ బ్రకాశించు తంత్రవార్తికమును వ్రాసెనో యా పండితసన్నుతుఁడగు భట్టపాదుని యొక్క మాఱువేషము అనఁబడువాఁడును, వేదాంతవచనముల విచారించువాఁడును;

17. వేదశీర్షచయసారసంగ్రహం
పంచరత్నమరుణాచలస్య యః।
గుప్తమల్పమపిసర్వతోముఖం
సూత్రభూతమతనోదిమంగురుం॥

ఎవఁడు వేదాంతసారముయొక్క చేరికయగునదియు, మఱుఁగు చేయఁబడి యల్పముగ నుండినను అంతట వ్యాపించునదియు నగు అరుణాచల పంచరత్నమును సూత్రప్రాయముగ నొనర్చెనో యా గురుఁడును;

18. దేవవాచిసుతరామశిక్షితం
కావ్యగంధరహితంచయద్యపి।
గ్రంథకర్తృణితథాపిసంస్ఫుర
ద్భాషితానుచరభావసంచయం॥

సంస్కృతమును బాగుగ నభ్యసింపనివాఁడైనను, కావ్యగంధము లేనివాఁడైనను గ్రంథకార్యమున వచనములకు వెనుక నడుచు భావముల పుష్టిగల వాఁడును;

19. లోకమాతృకుచదుగ్ధపాయిన
శ్శంకరస్తవకృతో మహాకవేః।
ద్రావిడద్విజశిశోర్నటద్గిరః
భూమికాంతరమపారమేధసం॥

లోకమాతయొక్క స్తన్యమును ద్రాగినవాఁడై శంకరస్తుతి నొనర్చినమహాకవియు, ద్రావిడ బ్రాహ్మణ శిశువును, నాట్యమాడుచున్న వాక్కులుగలవాఁడగు సంబంధమూర్తియొక్క మాఱు వేషమును, అపారబుద్ధిగలవాఁడును;

20. భూతలేత్విహతృతీయముద్భవం
క్రౌంచభూమిధరరంధ్రకారిణః।
బ్రహ్మనిష్ఠితదశాప్రదర్శనాత్
యుక్తివాదతిమిరస్యశాంతయే॥

బ్రహ్మనిష్ఠగలవారియొక్క స్థితిని కనుబఱచి, యుక్తివాదమను చీకటిని పోగొట్టుటకై జనించిన కుమారునియొక్క మూడవ యవతారమును;

21. కుంభయోనిముఖమౌనిపూజితే
ద్రావిడేవచసివిశ్రుతంకవిం।

దృష్టవంతమజరంపరంమహః
కేవలంధిషణయాగురుంవినా॥

అగస్త్యుఁడు మున్నగు ఋషులచేత బూజింపబడిన ద్రావిడభాషయందు ప్రసిద్ధకవియును, గురువులేక కేవలము బుద్ధిచే నాశరహితమును మాయకంటె పరంబగు తేజస్సును చూచినవాఁడును;

22. బాలకేపిజడగోపకేపివా, వానరేపిశునివాహకేపివా।
పండితేపిపదసంశ్రితేపివా,పక్షపాతరహితంసమేక్షణం॥

బాలునియందును, జడునియందును, గొల్లవానియందును, వానరమందును, కుక్కయందును, దుర్జనునియందును, పండితునియందును, ఆశ్రితునియందును పక్షపాతము లేనివాఁడై సమముగ చూపుగల వాఁడును;

23. శక్తిమంతమపిశాంతిసంయుతం
భక్తిమంతమపిభేదవర్జితం।
వీతరాగమపిలోకవత్సలం
దేవతాంశమపినమ్రచేష్టితం।

శక్తిగలవాఁడయ్యును శాంతికలవాఁడును, భక్తిగలవాఁడయ్యును భేదము లేనివాఁడును, అనురాగము లేనివాఁడైనను లోకమునందు వాత్సల్యము గలవాఁడును, దివ్యాంశముగలవాఁడైనను అణకువజెందిన నడవడి గలవాఁడును;

24. ఏషయామిపితురంతికంమమా
స్వామినంతునవిక్ష్యతామితి।
సంవిలిఖ్యగృహతోవినిర్గతం
శోణశైలచరణంసమాగతం॥

నేను తండ్రిగారగు ఈశ్వరుని సన్నిధానమునకేఁగెను, నన్ను వెదుక వద్దని జాబువ్రాసి ఇంటనుండి బయలువెడలి యరుణగిరి జేరినవాఁడును;

G—6

25. ఈదృశంగుణగణై రభిరామం
ప్రశ్రయేణరమణంభగవంతం।
సిద్ధలోకమహిమానమపారం
పృష్టవానమృతనాథయతీంద్రః॥

ఈలాటివాఁడును, గుణములయొక్క గుంపుచే మనోహరుఁడును యగు రమణభగవంతుని అపారంబగు సిద్ధలోకమహిమనుగురించి అమృతనాథయతీంద్రుఁ డడిగెను.

26. ఆహతంసభగవానగవాసీ
సిద్ధలోకమహిమాతుదురూహః।
తేశివేనసదృశాశ్శివరూపా
శ్శక్నువంతిచవరాన్ప్రదాతుం॥

అరుణగిరియందుండు రమణభగవంతుఁ డమృతనాథయతికి సిద్ధుల మహిమ ఊహింపనలవిగానిదియు శివునితో సమానులును శివరూపులు నయి వరముల నిచ్చుటకుగూడ సమర్థులగుచున్నారనియును వచించెను.

ఇతి శ్రీరమణగీతాసు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీ రమణాంతేవాసినో వాసిష్ఠస్య గణపతే
రుపనిబంధే సిద్ధమహిమానుకీర్తనంనామ
అష్టాదశోధ్యాయః

ఇటుల బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమునగు శ్రీరమణగీతయందు
శ్రీ రమణ శిష్యుఁడును వాసిష్ఠుండునైన గణపతిచేఁ జేయబడిన
గ్రంథమున సిద్ధమహిమానుకీర్తనమను
పదునెనిమిదవ అధ్యాయము.

శ్రీరమణార్పణమస్తు.

శ్రీ రమణాయ నమః

# శ్రీ రమణ చత్వారింశత్



వందే శ్రీరమణర్షే రాచార్యస్య పదాబ్జమ్
యో మేఽదర్శయదీశం భాంతం ధ్వాంతమతీత్య॥

అంధకారమున కావల ప్రకాశించు యీశ్వరుని నాకు జూపిన ఆచార్య శ్రీరమణమహర్షుల పాదారవిందములకు మ్రొక్కుదును.

1. కథయా నిజయా కలుషం హరతా
కరుణానిధినాఽరుణశైలజుషా।
ఖగవాహనభాషితతత్త్వవిదా
వృషవాహన మౌనరహస్యభృతా॥

తన కథచేతఁ బాపములను హరించువాఁడును, కరుణానిధియు, అరుణాచలుని సేవించువాఁడును, గరుడవాహనుఁడగు విష్ణువు భాషితము (అనఁగా భగవద్గీత) యొక్క తత్త్వము నెఱింగినవాఁడును, వృషభవాహనుఁడగు శివుని మౌనరహస్యమును ధరించువాఁడును,

2. గణరాణ్ముఖసూరిసభాగురుణా
గుణసంచయరత్నమహోదధినా।
ఘనగూఢసహస్రకరేణయథా
తనుకంచుకగుప్తమహోమహసా॥

గణపతి మొదలగు పండితుల సభకు గురువైనవాడును, గుణరత్నసమూహమునకు మహాసముద్రమైనవాఁడును, మబ్బుమాటయిన వేవెలుంగువలె దేహమను కంచుకముచే దాపఁబడిన మహాతేజస్స్వరూపమైనవాఁడును,

3. చతురేణచలేంద్రియనిగ్రహణే
పటునాపరకీయగుణగ్రహణే।
ఛలవర్జితమానసమాధిజుషా
బలతర్జితభీకరకామరుషా॥

చలించుస్వభావముగల యింద్రియములను లోఁబఱచుకొనుటయందు నేర్పరియు, పరులగుణములను గ్రహించుటయందు సమర్థుఁడును, వంచన యించుకయు లేని మానసమాధిం బూనినవాఁడును, భయంకర కామక్రోధములను బలముచే నడఁగఁగొట్టిన వాఁడును,

4. జఠరంసమయేపరిపూరయతా
కఠినంవ్రతమద్రితటేచరతా।
ఝషకేతనశస్త్రదురాపహృదా
కృషిమాత్మవిబోధవిధావదధతా॥

సమయమునఁ గడుపు నింపుకొను వాఁడును, గొండచఱియలోఁ గఠినవ్రతమును జరపుకొనువాఁడును, మీనకేతుని (అనఁగా మన్మథుని) శస్త్రములకు అగ్గముగాని హృదయము గలవాఁడును, ఆత్మవిబోధ విధానమునఁ బనిఁగొన్నవాఁడును,

5. భవభీకరవారినిధింతరతా
కరతామరసేనసుపాత్రవతా।
స్వదృశాధికశీతలకాంతిభృతా
భయమంఘ్రిసరోజజుషాంహరతా॥

జన్మరూపమైన భయంకరసముద్రమును దాఁటినవాఁడును, గేలుదమ్మియే చక్కని పాత్రగాగలవాఁడును, మిక్కిలి చల్లని కాంతి దాలుచు తనచూడ్కి చేతఁజరణకమలసేవకుల భయమునుహరించువాఁడును,

6. నమతామతిభక్తిమతాంనిధినా
ఘనతాపవిధూననసన్నిధినా।

యతిధర్మతతింపరిపాలయతా
పరితశ్చతమోవినివారయతా॥

మిక్కుటమగు భక్తితో మ్రొక్కులిడువారి పాలిటి పెన్నిధియైనవాఁడును, సన్నిధి మాత్రమునఁ నెంత దొడ్డ తాపములైనను బారఁద్రోలువాఁడును, యతిధర్మములనెల్లఁ బరిపాలించువాఁడును, జుట్టునున్నవారి తమమును జక్కఁగా నివారించువాఁడును,

7. ఫణినాయకవర్ణ్యగుణౌఘభృతా
భణితీఃప్రియసత్యహితాభణతా।
బహుమానవశాదయతాసుఖితా
మవమానతతేరవిదూనవతా॥

పాములరాజు (అనగా ఆదిశేషువు) పొగడఁదగిన గుణసమూహము గలవాఁడును, ప్రియము సత్యము హితము నగు మాటలఁ బలుకువాఁడును, బహుమానవశమున నుబ్బనివాఁడును, అవమానము లెన్ని వచ్చినను గుందనివాఁడును,

8. యతినామధిపేనకుశాగ్రలస
న్మతినాధృతినాశితచిత్తభువా।
లహరీంప్రమదస్యసదావహతా
నిహతాంతరశాత్రవసంహతినా॥

యతుల నాయకుఁడును, కుశాగ్రబుద్ధియైనవాఁడును, చిత్తసంభవుని (మన్మథుని) ధీరతచే నాశ మొనర్చినవాఁడును, ఆనందలహరిని సదా వహించువాఁడును, అంతశ్శత్రుసమూహమును సమయించినవాఁడును,

9. భగవత్పదమన్యజనాసులభం
స్వగుణైరధిగత్యపరంజయతా।

మమతారహితేనహితేనసతాం
నిహితేనగణప్రభుణాహృదయే॥

ఇతర జనులకు సులభముగాని భగవత్పదమును దనగుణముల చేతఁ బొంది పరమును జయించినవాఁడును, మమతలేనివాఁడును సజ్జనమునకు హితుడును, గణపతిచేత హృదయమందు నిలుపుకొనఁబడినవాఁడును,

10. ధరణీధరజాంకమపిత్యజతా
ధరణీతలవాసితమోధుతయే।
నరవేషభృతానగరంధ్రకృతా
రమణేనసనాథమిదంభువనం॥

భూతలవాసుల తమము నెగురఁ గొట్టుటకై పార్వతియొడిని సైతము వీడినవాఁడును, మనుష్యవేషముఁ దాల్చిన క్రౌంచబిలకారి (కొంచగుబ్బలిని దూటువొడిచినవాఁడు, అనగాఁ గుమారస్వామి)యును నగు శ్రీ రమణునిచేత నీలోకము సనాథమైనది.

11. పరదేశినేవధవళేనవాససః
శకలేనవేష్టితకటీవిశోభినా।
వరదేశికేననరవేషధారిణా
శిఖివాహనేనగురుమజ్జగద్భవేత్॥

పరదేశివలెఁ దెల్లని గోచిపేలికను మొలకుఁజుట్టి శోభిల్లువాఁడును, శ్రేష్ఠగురువును, మనుష్యవేషముఁ దాల్చిన మయూరవాహనుఁడు అనగాఁ గుమారస్వామియును అగు శ్రీ రమణునిచేత జగము గురుయుక్త మయ్యెడిని.

12. అతీతగుణజాలాయ నైష్ఠికబ్రహ్మచారిణే।
నమోమాయామనుష్యాయ గురవేతారకారయే॥

గుణసమూహమున కతీతుఁడైనవాఁడును, నైష్ఠికబ్రహ్మచారియు, మాయామనుష్యాకారుఁడును, తారకాసురవైరి, అనగా కుమారస్వామి యును అగు గురువునకు నమస్కారము.

13. యానాయాత్రన కేకినాంకులపతిః
స్నానాయన స్వర్ణదీ
పానాయక్షితిభృన్మహేంద్రదుహితు
ర్నస్తన్యదుగ్ధామృతం।
గానాయప్రమథేశ్వరాస్సవయసో
నైవాత్రవీణాభృతో
వాసంశోణగిరౌకరోషిభగవన్
క్రౌంచాద్రిభేత్తః కుతః॥

ఇచ్చట యానమునకై నెమళులకులపతి లేఁడు; స్నానమునకై స్వర్గనదిలేదు; పానమునకై పార్వతీదేవి చనుబాలు అను నమృతము లేదు; గానమునకై సవయస్కులగు వీణాధరులు ప్రమథనాథులు ఇచ్చట లేనే లేరు; మఱి, క్రౌంచగుబ్బలినిదొలిచిన వాఁడా (కుమారస్వామి), భగవంతుఁడా, అరుణాచలమందేల నివసింతువు?

14. ఏకంవక్త్రముమాంకవాసవిరహః
పాణౌనశక్త్యాయుధం
మర్త్యత్వంనపతాకినీచపృతనా
పార్శ్వద్వయేనాకినాం।
వేషోలంపునరేషముగ్ధనయన
ప్రచ్ఛాదనేభూజుషా
మంతర్ధానముపైషితారకరిపో
క్వస్తన్యదాయాదతః॥

ఒకే మొగము, పార్వతియొడినుండి వీడ్పాటు, చేతియందు శక్తి యను నాయుధము లేమి, మర్త్యజన్మము, పతాకములఁ బూనిన దేవసేన యిరుప్రక్కల లేమి—ఈవేసము భూలోకవాసుల ముగ్ధనేత్రముల మూసి వేయుటకుఁ జాలనుగాని, యో తారకాసురవైరీ (కుమారస్వామీ) స్తన్యదాయాదినుండి యెట్లు నీవంతర్ధానము కాఁగలవు?

15. కేచిద్యోగవిదాంపురస్సర ఇతి
ప్రజ్ఞానిబుద్ధ్యాపరే
సాధుః కశ్చిదతీత రేగురుధియా
కేప్యంఘ్రిపద్మంతవ।
సేవంతేరమణాభిధానమనుజ
క్షేమాయజాతక్షితౌ
ద్విత్రాస్త్వాంగిరిజాంకపీఠనిలయం
జానంతి దేవంగుహం॥

యోగవిదులలో నగ్రేసరుఁడని యొక కొందఱును, బ్రజ్ఞాని యను తలంపుతో మఱికొందఱును, యొకానొక సాధువని యితరులును, గురువని భావించి యెవరో కొందఱును నీపాదపద్మములను సేవింతురు. ఓ రమణనామధారీ, నీవు మానవక్షేమముకొఱకుఁ బుడమియందవతరించిన యుమాంకపీఠవాసియగు దేవుఁడవే (కుమారస్వామివే) అని యిరువురో మువ్వురో యెఱుంగుదురు.

16. ఓంకారార్థముపాదిశో భగవతే
వాణీమనోహారిణే
తాతాయాప్యుపదేష్టుముద్యతమభూ
త్కించి త్త్వదీయంముఖం।
జ్యేష్ఠస్యాద్యసహోదరస్యగురుతాం
ప్రాప్తోసిధీగౌరవాత్

సుబ్రహ్మణ్యకనిష్ఠతామపగత
స్సర్వాధిక స్త్వంగుణైః॥

భగవంతుఁడగు వాణీమనోహరునకు (బ్రహ్మదేవునకు) ఓంకారార్థము నుపదేశించితివి. నీమోము తండ్రికిఁగూడ నించుక యుపదేశింప సమకట్టినదాయెను. బుద్ధిగౌరవమువలన నిప్పుడు అన్నకు గురువైతివి. ఓ సుబ్రహ్మణ్యా, నీవు పిన్నవయ్యును గుణములచేత నందఱికన్న మిన్నవైనాఁడవు.

17. యత్పూర్వంశ్రుతిపారదర్శిధిషణో
ద్వైపాయనోద్ధ్యారుహాత్
పశ్చాద్బోధకలావిఘూతతిమిర
శ్శంకాపహశ్శంకరః।
తత్సంప్రత్యఖిలావనీతలజుషా
మాచార్యసింహాసనం
దేవత్వాంప్రతివీక్షతేనరతనో
గీర్వాణసేనాపతే॥

దేనిని మున్ను వేదసారము నెఱుఁగు బుద్ధిగల ద్వైపాయనుఁడు (వ్యాసుఁడు)ను, పిమ్మట బోధకళచేతఁ జిమ్మచీఁకటి నెగఁజిమ్మువాఁడు శంకాపహారియగు శంకరుఁడును అధిరోహించిరో, ఆ యఖిలజగదాచార్య సింహాసనము ఇప్పుడన్ననో ఓ దేవా, మనుష్యదేహమును దాల్చిన యో దేవసేనాపతీ (కుమారస్వామీ), నిన్నుఁగోరి యెదురుచూచుచున్నది.

18. ధర్మేనాశముపాగతేత్రిభువనే
పర్యాకులేపాపతః
ప్రజ్ఞానేపరితోగిరాంపథిముధా
సంచార్యమాణేజనైః।

సద్భావేపరమేశ్వరస్యచపితు
స్సందేహడోలాంగతే
ద్వీపఃకై తవమర్త్యకేకితురగ
త్వామంతరాకస్సతాం॥

ధర్మము పొడగుచుండఁగా, ముల్లోకములును పాపమువలన నల్లా డుచుండఁగాఁ, జట్టును (అనఁగా వస్తువులోనికిఁ బ్రవేశింపక) మాటల పాటయుందే ప్రజ్ఞానము జనులచేత వృథా నడపింపఁబడుచుండఁగాఁ, దండ్రియగు పరమేశ్వరుని సద్భావమే (ఉనికియే) సందేహ డోలాగత మగుచుండఁగా, ఓ మాయామర్త్యరూపా, ఓ మయూరవాహనా, సజ్జన మునకు నీవుదక్క మఱి ద్వీపము (శరణ్యము) ఏమిగలదు?

19. వైరాగ్యంతనవిత్తమస్తుకరుణాం
శక్నోషిహాతుంకథం
దూష్యాస్తేస్తుసముద్యమఃపితృపద
ధ్యానంచకింతాదృశం।
కామస్తేస్తువిగర్హితోవినమతాం
రక్షాచకింగర్హితా
స్కందచ్ఛద్మమనుష్యకిన్నుసమయం
కంచిత్సముద్వీక్షసే॥

వైరాగ్యము నీ సొత్తగునుగాక, కరుణ నెట్లు పారిపుచ్చఁగలవు? పనిబూనుట నీకు దూష్యమగునుగాక, పితృపదధ్యానమును అట్టిదేనా? కామము నీకు నింద్యమగునుగాక. భక్తరక్షణము నింద్యమగునా? ఓ స్కందుఁడా, ఓ మాయామనుష్యుఁడా, యేదే నొక సమయము నెదురు చూచుచు నూరకున్నావా యేమి?

20. దూరంయాహికువాదధర్మవృష తే
నేతఃపరంపంగుతా

దుర్భ్రాంతేభువనంజహీహిపరితో
వర్ధస్వసంసత్సతాం।
సోదర్యేణసమన్వితోభువమిమాం
ప్రాప్తోగురుగ్రామణీః
శూరాంతఃపురనేత్రవిభ్రమహరో
దేవోభవానీసుతః॥

కువాదమా, దూరముగాఁ బొమ్ము; ధర్మవృషభమా, యిఁక మీఁద నీవుఁ గుంటువలదు; దుర్భ్రాంతీ, పుడమిని వీడుము; సజ్జనులకూటమా, చుట్టును వర్ధిల్లుము; (ఏల యన), శూరాసురుని రాణివాసముల చూడ్కి వేడుకను హరించిన దేవుఁడు పార్వతీపుత్రుఁడు (కుమారస్వామి) గురూత్తముఁడు సోదరునితోఁ గలసికొని యీ భూమిని జేరినాఁడు.

21\. జన్మస్థానమవాప్యగుప్తమహమో
యోభేదమాఘ్రాతవాన్
భూతానాంచరతాంపృథగ్విధధియా
మాత్మైవయోభాసతే।
దేహంసర్వమిదంజగచ్చవిభవా
దాక్రమ్యయఃప్రోల్లస
త్యేకస్తంగురుమూర్తిమానమతరే
లంబోదరభ్రాతరం॥

తేననునది పుట్టుచోటును జెంది యెవఁడు భేదము రూపుమాపెనో, చరించు భూతముల నానావిధచేతములం దెవ్వఁడు తాను (ఆత్మ) గానే వెలుంగునో, దేహమును ఈ సర్వజగత్తును విభవమువలన నాక్రమించి యెవ్వఁడు ఒక్కఁడే పరిఢవిల్లునో, ఆ గురుమూర్తిని లంబోదరసోదరునిఁ (గుమారస్వామిని) బ్రార్థింపుమోయి.

22. అంతర్యశ్చబహిర్విధూతతిమిరం
జ్యోతిర్మయంశాశ్వతం
స్థానంప్రాప్యవిరాజతేవినమతా
మజ్ఞానమున్మూలయన్।
పశ్యన్విశ్వమపీదముల్లసతియో
విశ్వస్యపారేపరః
తస్మైశ్రీరమణాయలోకగురవే
శోకస్యహంత్రేనమః॥

ఎవ్వఁడు లోపలను వెలుపలను దిమిరమును బటాపంచలు గావించిన జ్యోతిర్మయశాశ్వతస్థానమును బొంది భక్తుల యజ్ఞానమును నిర్మూలించుచు విరాజిల్లుచున్నాఁడో, యెవ్వఁడు ఈ విశ్వమును జూచుచున్నను విశ్వముయొక్క పారమునందుఁ బరుఁడై పరిఢవిల్లుచున్నాఁడో, లోకగురువును శోకనాశకుఁడునైన యా శ్రీ రమణునకు నమస్కారము.

23. ప్రసరతాదితః శుభవిలోకితం।
రమణతేసకృ త్ఫలతుమేకృతం॥

ఓ రమణా, యెప్పుడైన నొకమాఱు నీ శుభవీక్షణ మిటు ప్రసరించుటం జేసి నా పున్నెము ఫలించును గాక!

24. రమణజన్మినా మయిభవాన్ గురుః।
అభిదఆశయ స్తవమహానురుః॥

ఓ రమణా, నీవు జీవులకు గురుఁడవోయి. భేదమెఱుఁగని నీ యాశయము (హృదయము) చాల గొప్పది.

25. జగదహంపరః స్ఫురతిమే త్రయం।
సదభిదంగిరాతవవిసంశయం॥

జగము నేను ఈశ్వరుఁడు అను మూఁడును సత్తునకు (ఉన్న వస్తువునకు) వేఱుగాకుండుట నీవాక్కువలన నిస్సందేహముగా నాకుఁ దోఁచెడిని.

26. త్వాముపదేశతోగలతిసంవిదా।
మయినిరన్వయా సదహామోర్భిదా॥

నీ యుపదేశమువలన నాయందు వేఱులేని యెఱుకచే సత్తునకును (ఉన్నవస్తువునకును) నేనను దానికిని భేదము జాఱిపోయినది.

27. అహమిమోంతర స్తమమలంహృది।
అనుభవేమభో స్తవకృపాయది॥

నీ కృప యున్నయెడల, నేననుదానిలోపలనున్న యీ నిర్మల వస్తువును హృదయమం దనుభవింతుమయ్యా!

28. నకరుణాగుణాస్తవవిదాంపతే।
హృదయతేజసః సహజభైవతే॥

విద్వాత్సార్వభౌమా, కరుణ నీకు గుణము కాదు; అది నీ హృదయ తేజస్సుయొక్క సహజప్రకాశమే.

29. తవతనుర్జ్వలత్యనఘవిద్యుతా।
తవదృగాతతాలసతిభాస్వతా॥

నీ సెమ్మేను మెఱుపై కనులకు మిఱుమిట్లు గొలుపుచున్నది. నీ నిడుద చూడ్కి కాంతిఁ దొలుకుచు వెలుగుచున్నది.

30. కబలితంమన స్తవవిభోహృదా।
త్వమసిసంతతంవిలసితోముదా॥

ఓ విభుఁడా, నీమనము హృదయముచే మ్రింగఁ బడినది. నీ వెల్లపుడును ఆనందమునఁ దేలియాడుచున్నావు.

31. భువనభూపతే ర్భగవతఃకృతే।
భవసిపాచకోయమవతాంపతే॥

ఓ యతిపతీ, జగత్ప్రభువైన భగవంతునికొలువున నీవు వంటల వాఁడవై యున్నావు.

32. నరపశూనిమానహమితాడయన్।
 పరశివౌదనంవితనుషేపచన్॥

తా॥ ఈ మనుష్యపశువులను అహమునఁ గొట్టి పరమశివుని యన్నము వండుచున్నావు.

33. తిమిరాణిన కేవలంవచోభిః
 కరుణాపాంగవిలోకితైశ్చన్యాణాం।
 హృదయేప్రసరంతిమర్దయంతం
 భగవంతం రమణం గురుం నమామి॥

చీకటులను కేవలము వాక్కులచేత నేగాక కరుణాకటాక్ష వీక్షణముల చేతను వెడలనడచుచు మానవుల హృదయమందు వ్యాపించు భగవంతుఁడు గురువును అగు రమణునకు మ్రొక్కెదను.

34. భవజలనిధింగాహంగాహం
 చిరాదలసాఽలసాన్
 పదజలరుహద్వంద్వద్వీపం
 శ్రితాం స్తవసంప్రతి।
 రమణభగవన్ కల్యాణానాం
 నికేతనపాహినః
 సదయదయయాసిక్తైర్దృక్తా
 నపాంగవిలోకితైః॥

చిరకాలము సంసారసాగరమందు మునిఁగిమునిఁగి డస్సిడస్సి యిప్పుడు నీ పదకమలద్వయమను దీవిగడ్డ నాశ్రయించిన భక్తులమగు మమ్ము ఓ దయాళూ, ఓ కల్యాణనిలయా, ఓ రమణభగవంతుడా, దయార్ద్రిములగు కటాక్షవీక్షణములచే రక్షింపుము.

35. యదినజననీ స్తన్యందద్యా
 చ్ఛిశోర్బతకాగతిః

యదిపశుపతిః క్రోధం కుర్యా
త్పశోరవనం కుతః।
యదిపదజుషామాచార్యత్వం
నిహంసి న సంశయం
భ్రమశతపరాభూతాః పాతే
తరంతు భవం కథం॥

తల్లి చనుబాలియ్యదేని యకటా! బిడ్డగతి యేమి కాగలదు? పశుపతి కోపము సేయునేని పశురక్షణ మెవ్వలనఁ జొప్పడును? (అట్లే) ఓ యాచార్యుఁడా, నీవు పదభక్తుల సంశయమును హరింపవేని లెక్కలేని భ్రమలకుఁ జిక్కువడి పరువుఁ గోల్పోయిన వీరు జన్మము నుండి కడతేఱుట యెట్లు ఘటిల్లును?

36. విశదహసితే పూర్ణా శాంతిః
సుధాకరసోదరే
స్థిరపృథులయోః పూర్ణా శక్తి
ర్దృశోరతులార్చిషోః।
హృదయకమలే నిత్యా నిష్ఠా
బహిశ్చ సరత్విషే
రమణభగవన్ కో వా మాసీ
సమస్తవ భూతలే॥

అమృతకరునకుఁ (జంద్రునకుఁ) దోఁబుట్టువనఁదగు విమల హాసము నందు నిండు శాంతి (నెలకొన్నది). దీటులేని తేజము కలిగి చలింపని గొప్పకన్నులందు నిండుశక్తి (నెలకొన్నది). వెలికిఁ బ్రసరించు కాంతిగల హృదయకమలమందు నిత్యనిష్ఠ (చెదరని నిలుకడ) (నెలకొన్నది). ఓ రమణ భగవంతుఁడా, భూతలమందు నీకు సమానుఁడగు వాఁడెవ్వఁడు?

37. దేవీశక్తిరియందృశోః శ్రితజన
ధ్వాంతక్షయాధాయినీ
దేవీశ్రీరియమంబుజాక్షమహిషీ
వక్త్రేసహస్రచ్ఛదే।
దేవీబ్రహ్మవధూరియంవిజయతే
వ్యాహారగూఢాపరా
విశ్వాచార్యమహానుభావరమణ
త్వాంస్తోతుకః ప్రాకృతః॥

చూడ్కియందిదే యాశ్రితజనుల తమము రూపుమాపు శక్తి దేవియు, వదన మను వేయిరేకుల కమలమున నిదే పద్మాక్షుని పట్టపు రాణి శ్రీదేవియు, వాక్కునందు దాగియున్నది యిదే బ్రహ్మయిల్లాలు పరాదేవియు విజయమొందుచున్నారు. ఓ విశ్వాచార్యా, ఓ మహానుభావా, ఓ రమణా, ప్రాకృతుఁ డెవ్వఁడు నిన్ను బొగడఁగలడు?

38. సోహంజాతోరమణభగవన్
పాదయోస్తేదవిష్ఠో
యద్యప్యస్మిన్మహతిసమయే
శక్తిలాస్యేప్రవృత్తే।
సూర్యస్యేవజ్వలితమహసో
దూరగాంనాథశక్తిం
విశ్వస్యాగ్ర్యాంతవమమమనో
వీతదుఃఖంతథాపి॥

ఓ రమణభగవంతుఁడా, నేను నీపాదయుగ్మమునకు ఎంతయో దవ్వున నున్నవాఁడనైతిని. అట్లయ్యును ఓ నాథా, శక్తిలాస్యము (నర్తన) గల యీ మహత్సమయము సాఁగుచుండగా, సూర్యుని తేజము వలె దగద్ధ

గాయమానమై దూరమేఁగుదెంచు నీ మేటిశక్తిని నమ్ముకొని నామనము దుఃఖరహితమగుచున్నది.

39. తద్భాగధేయమసమానమనేకమాని
వాసార్జితంక్షితిభృతఃఖలులోహితస్య।
అంగీచకారభగవాన్ రమణో మహర్షి
రన్యేషుసత్స్వయదిమంబహుషుస్థలేషు ॥

అరుణాచలమునకుఁ బలువురు మునులు నివసించుటంజేసి చేకూఱిన భాగ్యము అసమానమైనది. (ఏలన) భగవంతుఁడు రమణమహర్షి యితర మహాస్థలములెన్నో యుండఁగా దీనినే అంగీకరించినాఁడు.

40. శాంతిర్నితాంతమధికాపరమాస్యశక్తిః
వైరాగ్యమద్భుతతమంకరుణాతుసాంద్రా।
జ్ఞానంనిరస్తకుహానంమధురంచవృత్తం
నౄణాంనిదర్శనమయంరమణో మహర్షిః॥

ఇతనికి శాంతియో అత్యంతము, శక్తియో పరమోత్కృష్టము; ఇతనికి వైరాగ్యమో అద్భుతతమము, కరుణయో సాంద్రము (దట్టమైనది); ఇతనికి జ్ఞానమో మాయను మటుమాయము గావించినట్టిది, వర్తనమో మధురమైనది; (కావున) మానవులకు నిదర్శనమైనవాఁ డీ రమణమహర్షి.

నారసింహిర్గణపతిర్వాసిష్ఠోరమణంగురుం।
చత్వారింశన్మితైఃపద్యైఃస్కందాంశంస్తుతవానృషిం॥

నరసింహుని పుత్రుఁడు వాసిష్ఠగణపతి చత్వారింశత్ (నలువది) అను పరిమితిగల ఈ పద్యములచే గురువును స్కందాంశసంభవుఁడును అగు రమణమహర్షిని స్తోత్రము గావించెను.

శ్రీ రమణార్పణ మస్తు.

---

# శ్రీరమణ విభక్త్యష్టకము



1. శ్రీమత్పారాశరోయం ప్రముదితవదనః
పావనః పార్వతీయః
ప్రత్యగ్దృగ్దేవకల్పోవిగతభవభయ
స్సర్వదాసుప్రసన్నః ।
ఆత్మన్యేవప్రలీనః పరమగుణనిధి
ర్మౌనముద్రోపపన్నో
దృష్టస్సంతృప్తచిత్తోరమణమునిరహో
సచ్చిదానందకందః॥

శ్రీమంతుఁడు పారాశరుఁడు నగుమోమువాఁడు పవిత్రుఁడు పార్వతీపుత్రుఁడు (దివ్య)జ్ఞాన దృష్టిం బొరసినవాఁడు దేవునితో సమానుఁడు జన్మభయరహితుఁడు సదాప్రసన్నుడు ఆత్మ (తన)యందే యడఁగియున్నవాఁడు పరమగుణనిధి మౌనముద్రఁదాల్చినవాఁడు మిక్కిలితనిసిన మనస్సుగలవాఁడు సచ్చిదానందకందమైనవాఁడు అగు రమణముని యహో! యిదే దర్శనమొసంగుచున్నాఁడు.

2. యందృష్ట్వైవావశిష్టం భవతిపునరహో
నేహాకర్తవ్యతాయాం
సద్యశ్చిత్తప్రసాదాద్విగలతిమనసః
సర్వసంకల్పజాలం ।

వృ_త్తిః శామ్యత్యనేకావిధిమనుజనితా
ద్వేషిణీవానిషేధాత్
సంతంపారాశరంతంగురురమణయతిం
సంతతంచింతయామి॥

ఆహా! యెవనిఁ బొడగాంచిన యంత నే యిఁక నిటఁ క_ర్తవ్యత నిశ్శేషముగ నశించునో, అప్పుడే పొడమిన చి_త్తప్రసాదమువలన మనస్సునందలి సంకల్పసమూహ మెల్ల జాఱిపోవునో, విధిని (చేయవలయు దానిని) అనుసరించి పుట్టినదియు నిషేధము (చేయఁగూడనిది) అగుటవలనఁ బగయైనదియును అగు పలుతెగల తలంపు అణఁగిపోవునో, ఆ మహాత్మునిఁ బారాశరుని గురుని రమణయతిని నిరంతరము తలంతును.

3. యేనేయంచిత్రసృష్టిః బహిరివమనసా
స్వప్నవత్సంప్రదృష్టా
దృష్టిః ప్రత్యగ్గతాపిప్రణతభయహారీ
సంవిసృష్టాదయార్ద్రా।
స్వార్థాస్సంగస్యహానా_త్తదనుగతధియ
స్సర్వతస్సన్నిరస్తాః
త్రాత_స్తేనేహమర్త్యోరమణభగవతా
ధన్యతాంయాతిసద్యః॥

ఎవనిచేత నీ చిత్రసృష్టి వెలుపలిదివోలె మనస్సుచే స్వప్న సమానముగాఁ జూడఁబడెనో, చూడ్కి_దివ్యత్వమును (జ్ఞానమును) బొరసిన దయ్యు భక్తులభయమునుహరించునదిగా దయార్ద్రముగానొనర్పఁబడెనో, సంగము వెన్నంటి వచ్చు స్వార్థభావములు సర్వమును సంగహానివలన సమయింపఁబడెనో, ఆ రమణభగవంతునిచేత రక్షింపఁబడు నిచ్చటి మ_ర్త్యుడు తత్‌క్షణమే ధన్యత నొందును.

4\. యస్మైతత్త్వార్థవేత్రే పరమపదవిదే
స్వాత్మనో బోధయిత్రే
స్వానందస్యాపయిత్రే జనిమరణభయా
త్ప్రాణినః పాలయిత్రే।
ఆత్మానం ప్రార్ప్య బుద్ధ్యా శరణముపగతా
ధన్యతాం యాంతి లోకా
స్తస్మై పారాశరాయోం రమణ భగవతే
జ్ఞానదాత్రే నమస్తే॥

తత్త్వార్థవేత్తకై పరమపదవిదునికై స్వాత్మబోధకునికై స్వానందముఁ గొలుపువానికై జననమరణభయమునుండి ప్రాణుల రక్షించువానికై యెవనికై లోకులు బుద్ధిపూర్వకముగా ఆత్మను (తనను) సమర్పించుకొని శరణముం బడసి ధన్యతనొందుదురో, ఆ జ్ఞానదాతకై పారాశరునికై ఓం రమణభగవంతునికై వందన మిడెదను.

5\. యస్మాత్సంపూర్ణకామాద్విగతకలిమలా
ద్దివ్యవాగాత్మదేహా
న్నిత్యం ప్రద్యోతమానాజ్జగతిహితపసా
సంస్థితప్రజ్ఞతో న్యః।
సంతప్తానాం ప్రజానాం విషయవిషధరై
రైన్నవకశ్చిచ్ఛరణ్యః।
తస్మాత్పారాశరాన్మేరమణమునివరా
దాత్మనస్సంవిదస్తు॥

ఎవనికంటె - సంపూర్ణకామునికంటెఁ గలిమలరహితునికంటె దివ్యవాగాత్మదేహునికంటె జగమందెల్లప్పుడుఁ దేజరిల్లుచున్నవానికంటె తపముచే స్థితప్రజ్ఞుఁడైనవానికంటె విషయములు అను విషధరముల (పాముల)

చేఁ దపింపఁబడు ప్రజలకు శరణ్యము వేఱొదియు లేనేలేదో ఆ పారాశరునివలన రమణమునివరునివలన నాకు ఆత్మజ్ఞానము కలుగునుగాక.

6. యస్యాహమ్మమతిర్హి స్వయమిహగళితా
సంవిదేవావశిష్టా
ధర్మాధర్మప్రపంచః సహవిధిభిరహో
సంప్రశాంతో నిషేధైః।
ఇష్టానిష్టే సమానే స్థితిరపి జగతి
ప్రాణినాంవాహితార్థా
తస్యేదం పాదయుగ్మం రమణభగవతః
సంప్రపద్యే శరణ్యం॥

అహా! యెవనికి "నేను" "నాది" అను తలంపు తనంతటనే వీఁడిపోయెనో, యెఱుకమాత్రమే మిగిలెనో, విధినిషేధములతో (వలయును - వలదు అను కట్టడలతోఁ) గూడిన ధర్మాధర్మప్రపంచము బొత్తిగా నణగిపోయెనో, ఇష్టానిష్టసమానస్థితియుఁగూడ జగమందలి జీవుల మేలుకొఱకే అయ్యెనో, శరణ్యమైన యా రమణభగవంతుని యొక్క పాదయుగ్మము నిదే భజింతును.

7. యస్మిన్నత్యాశ్రమస్థే హ్యభయముపగతే
వీతవర్ణప్రపంచే
బ్రహ్మిష్ఠే నిత్యతృప్తే పరమరసనిధౌ
సిద్ధయోష్టాప్రణమ్రాః।
కామాశ్చప్రాప్తకామాన్సుఖమిహపరమం
సంవిశంతీవనిత్యం
తస్మిన్పారాశరే మే రమణమునివరే
ధీంద్రియాణ్యారమంతాం॥

ఎవనియందు ఆశ్రమాతీతుఁడైయున్న వానియందు అభయ మొందినవానియందు వర్ణప్రపంచరహితునియందు బ్రహ్మనిష్ఠునియందు నిత్యతృప్తునియందుఁ బరమరసనిధానమైనవానియందు అష్టసిద్ధులు (అణిమాదులు) మిక్కిలి వంగియున్నవో (అడఁకువఁ జూపుచున్నవో), మఱియుఁ గామములు సఫలములై యెల్లప్పుడుఁ బరమసుఖముం బొరయు నట్లున్నవో, ఆ పారాశరునియందు రమణమునివరునియందు నా బుద్ధియు నింద్రియములును గ్రీడించుచుండును గాక!

8\. స్వామిన్ సర్వార్తిహారిన్నయిపరమగురో
నిర్మలజ్ఞానమూర్తే
వాసిష్ఠస్యప్రసాదాత్తవచరణయుగం
ప్రాప్యసర్వైర్దురాపం।
పూర్ణాఃకామాఇహేతిప్రణిహితమనసా
ధన్యతాంభావయంతం
త్రాహీమంపాపజాలాద్రమణమునిపతే
దైవరాతంప్రపన్నం॥

స్వామీ, సర్వార్తిహారకుఁడా, ఓ పరమగురూ, ఓ నిర్మలజ్ఞానమూర్తీ, అందఱికి నందరాని నీ పాదయుగ్మమును వాసిష్ఠుని (వాసిష్ఠ గణపతియొక్క) ప్రసాదమువలనం బడయఁగలిగి యిటఁ గోరికలు నిండినవని దండి నిలుకడం జెందిన డెందముతో ధన్యోఽస్మి యనుకొనుచున్న శరణాగతుఁడగు నీ దైవరాతుని పాపసమూహమునుండి కాపాడుము.

రమణం రమణీయచిద్విలాసం
శరణం సంస్మరణీయసద్విలాసం।
పరమం పరమార్థతత్త్వబోధం
కలయేకల్మషకీలనప్రబోధం॥

రమణీయమగు చిద్విలాసము గలవాఁడును శరణమైనవాఁడును మిక్కిలి యెన్నఁదగిన చక్కని విలాసము (కాదా - సద్వస్తువుయొక్క లీల) గలవాఁడును బరముఁడును బరమాత్మతత్త్వబోధరూపమైన వాఁడును బాపమునుదహించు ప్రభోదస్వరూపమైనవాఁడును అగు శ్రీ రమణునిఁ దలంతును.

ఇతీదం దైవరాతీయం శ్రీ రమణ విభక్త్యష్టకం
సంపూర్ణం.
ఇట్లు దైవరాత విరచితమగు శ్రీ రమణ విభక్త్యష్టకము
సంపూర్ణము.
శ్రీ రమణార్పణ మస్తు.

---

# శ్రీ గురు గీతము

1. అవ్యక్తాద్వ్యక్తమేతద్వ్యక్తం జాతమశేషం।
యద్ధత్తేతదజస్రం యత్రాంతే లయమేతి॥

అవ్యక్తమగు దేనినుండి సమస్తప్రపంచము పుట్టినదో, ఏ యవ్యక్తము అవ్యక్తప్రపంచమును ధరింపుచున్నదో, ఏ యవ్యక్తమునందు అంతమునం దది లయమును బొందుచున్నదో;

2. ఆధారేఖిలలోకా యస్మిన్నేకాంశసహాలక్ష్మైః।
బ్రహ్మాండం ప్రతితిష్ఠత్యేతన్నిస్తులసత్త్వే॥

ఈ బ్రహ్మాండము గోళముల లక్షలతో సహా నిరుపమాన సత్త్వము గల ఏయాధారమునందు నిలిచియున్నదో;

3. సూర్యాదిగ్రహభాసాంయస్మాల్లంఘనతేజః।
యద్బ్రహ్మాదిసురాణాంశక్త్యైశక్తిరుతాహో॥

ఏ ఘనతేజస్సు సూర్యాదిగ్రహతేజస్సులకు మూలమో, ఎయ్యది బ్రహ్మాది దేవతల శక్తికి కారణమో లేక శక్తిగానే యున్నదో;

4. జ్ఞాత్వాతత్త్వమసంగాభాసాయస్యరమంతే।
యజ్జాలేనసమస్తేద్వైతేత్వల్పమతీనాం॥

సంగరహితులు తత్త్వమును దేని ప్రకాశముచే దెలుసుకొని ఆనందించుచున్నారో, అల్పబుద్ధిగలవారికి దేని మాయచే సమస్తమునందు ద్వైతబుద్ధి కలుగుచున్నదో;

5. యద్ధ్యానేనభవంతిస్వాత్మానందనిమగ్నాః।
యన్నిష్ఠాఖిలముక్తిర్యచ్ఛన్దోఽపితదర్థః॥

దేనిని ధ్యానించి స్వాత్మానందమునందు మునుగుచున్నారో, దేనియందు నిష్ఠ ముక్తియో, ఎయ్యది వేదమై యుండియు దాని యర్థమై యున్నదో;

6. తద్బ్రహ్మప్రణవాఖ్యంచిత్తేధ్యానకృతే మే।
అశ్రాంతంరమణాఖ్యాంబిభ్రద్భాతుమదిష్టాం॥

అట్టి ప్రణవపరబ్రహ్మము సంతతము నాచిత్తమునందు ధ్యానము నిమిత్తము నాకిష్టమగు రమణనామమును ధరించినదై భాసించునుగాక.

7. ఆధారేధృతమూలంహార్దాబ్జేకృతవాసం।
శీర్షాబ్జాయవహద్యత్పశ్చాదింద్రియశక్త్యై॥

ఎయ్యది మూలాధారమునందు వేళ్లుదన్ని హృదయపద్మమున వసించుచున్నదై పిమ్మట సహస్రారమునకు ప్రవహించుచు, తరువాత ఇంద్రియ శక్తులకుఁ గారణమగుచున్నదో;

8. దృష్ట్యాంతరత్రపరాచ్యాంయద్దేహభ్రమకారి।
ఆవృత్తింతుపునర్యత్స్వాత్మైక్యానుభవాయ॥

ఆయింద్రియద్వారా గలిగిన పరాచీ దృష్టియందు ఎయ్యది దేహాత్మ భ్రమను కలుగఁజేయుచున్నదో, ఎయ్యది తిరిగియు స్వజన్మస్థానమునకు (హృదయమునకు) ఆవృత్తమై స్వాత్మైక్యానుభవమునకుఁ గారణమగు చున్నదో;

9. పశ్యద్వావిషయౌఘంవిశ్రాంతంయదుతాహో।
ముక్త్యైసంస్థితమంతర్వృత్త్యైక్యానుభవేన॥

విషయములను జూచినను లేక విశ్రమించియున్నను ఎయ్యది ఏక వృత్త్యనుభవముచే లోపల నిలిచినయెడల ముక్తికిఁ గారణమగుచున్నదో;

10. ఆత్మజ్యోతిరిదంమేబిభ్రాణంరమణాఖ్యాం।
అశ్రాంతంస్ఫురతాత్తచ్ఛుద్ధంహార్దసరోజే॥

రమణనామమును వహించు శుద్ధమగు నా యాత్మజ్యోతిస్సు సంతతము నాహృదయపద్మమునందు స్ఫురించునుగాక;

11. యద్దీపాద్రమణాఖ్యాద్వ్యక్తంగాణపతీషు।
వాణీభిత్తిషుధత్తేగీతాచిత్రవిలాసం॥

ఎయ్యది రమణుఁడను దీపమునుండి వెలువడి గణపతివాక్కులనెడి గోడలయందు గీతయనెడి చిత్రరూపము ధరింపుచున్నదో;

12. యద్ధంతిచ్ఛవిజాలైరజ్ఞానాంతిమిరాణి।
తత్తత్వంస్ఫురతాన్నస్తారధ్యానసమాధౌ॥

ఎయ్యది కాంతిజాలములచే అజ్ఞానమనెడి చీఁకట్లను పోఁగొట్టుచున్నదో, ఆజ్యోతిస్తత్త్వము మా ప్రణవధ్యాన సమాధియందు స్ఫురించునుగాక.

13. యాతాయాతవిహారై రాధారేషుచక్రేష్ు।
సంచారంవిదధానంకించాశేషవిసారి॥

షడాధారచక్రములందును సహస్రారమునందును యాతాయాతములచే సంచారము చేయునదియు, మఱియు సర్వమును వ్యాపించునదియు;

14. ఆలంబేనవిహీనంవ్యోమాభంపరిపూర్ణం।
నిశ్శబ్దంగురురూపంతద్బ్రహ్మస్ఫురతాన్మే॥

నిరాలంబము ఆకాశసదృశము పరిపూర్ణము నిశ్శబ్దము గురురూపమునగు పరబ్రహ్మము నాకు స్ఫురించును గాక.

15. జ్ఞానంభాతిపరోక్షంయ త్తత్వశ్రవణేన।
యత్సాంగత్యవిశేషో హేతుస్స్యాదపరోక్షే॥

దేని తత్త్వమును వినిన వారలకు పరోక్షజ్ఞానము భాసింపుచున్నదో, దేని సాంగత్యము అపరోక్షజ్ఞానమునకు కారణమగుచున్నదో;

16. యచ్చింతాస్థిరముక్త్యై బ్రహ్మైతద్రమణాఖ్యం।
మామావృత్యసమంతా దానందేనిదధాతు॥

దేని చింత స్థిరముక్తికి కారణమగుచున్నదో, ఆ రమణాఖ్య బ్రహ్మము అంతటను నన్నావరించి ఆనందమునందు ముంచును గాక.

తారానందనియుక్తః ప్రీత్యాతస్యమతేన।
ఆధాద్దీప్తగభీరంవాసిష్ఠోగురుగీతం॥

ప్రణవానంద ప్రేరితుఁడై వానిమతము ననుసరించి అర్థగాంభీర్యముగల గురుగీతమును ప్రీతితో వాసిష్ఠుఁడొనరించెను.

తెలుగు విశ్వశ్రీ [illegible]ణమస్తు.

—

# శ్రీ రమణాశ్రమ పుస్తకాలయము

## భగవాన్ శ్రీ రమణమహర్షి ఉపదేశగ్రంథములు

| | | రూ. | అ. |
|---|---|---|---|
| నేనెవడను ? | ... ... | 0 | 2 |
| ఉపదేశసారము (అప్పడపుఁబాట, ఆత్మవిద్యతో) | | 0 | 2 |
| ఉన్నది నలుబది; (సద్విద్య) | ... | 0 | 8 |
| శ్రీ రమణగీత (అనుబంధ తాత్పర్యములతో) | ... | 0 | 12 |
| రమణగీతాపద్యములు (గీతమాలతో) | ... | 1 | 0 |
| విచారసంగ్రహము | ... ... | 0 | 3 |
| ఉపదేశమంజరి | ... ... | 0 | 4 |
| అరుణాచల స్తుతి పంచకము | ... ... | 0 | 2 |
| వివేక చూడామణి (వచనము) | ... ... | 0 | 8 |

## శ్రీ మహర్షి చరిత్ర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| శ్రీ రమణ లీల | ... ... | 2 | 8 |
| శ్రీ రమణ పూజాకల్పము | ... ... | 0 | 6 |
| రమణచరిత్రసంగ్రహము | ... ... | 0 | 0 |
| శ్రీ రమణస్తుతి పాటలు | ... ... | 0 | 6 |
| శ్రీ మహర్షియు తత్సందేశము | ... ... | 0 | 12 |
| రమణమహర్షి (112 పటములతో) | | (ముద్రింపబడును) | |
| నివేదన | ... ... | 0 | 6 |
| ఆరాధన | ... ... | 0 | 4 |
| నైవేద్యము | ... ... | 0 | 4 |

శ్రీ నిరంజనానందస్వామి,

సర్వాధికారి.